శ్రీః

# అష్టకద్వయా

శ్రీశంకరభగవత్పాదవిరచితా

**శ్రీరాజరాజేశ్వర్యష్టకమ్ - శ్రీ అన్నపూర్ణాష్టకఞ్చ**

"రవలీ"వ్యాఖ్య - మేళ్లచెఱ్వు వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి



ప్రకాశకులు

శ్రీసచ్చిదానందాశ్రమము

**తపోవనము, తుని - 533 401. తూ.గో.జిల్లా, ఆం.ప్ర.**

శ్రీః

# అష్టకద్వయీ

శ్రీశంకరభగవత్పాదవిరచితా

**శ్రీరాజరాజేశ్వర్యష్టకమ్ - శ్రీఅన్నపూర్ణాష్టకఞ్చ**

**"రవలీ"వ్యాఖ్య - మేళ్లచెఱ్వు వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి**


ప్రథమ ముద్రణ : వినాయకచవితి 2019

ప్రతులు : 1000

పుటలు : 24

వెల రూ. : అమూల్యం




404, Janjanam Complex, Opp. I-Town Police Station,
CHIRALA - 523 155.
Cell : 94401 15411



D.T.P.:
P.PARVATHI
CELL: 7416586775

Printed at :
KARSHAK ART PRINTERS
Hyderabad.

# శ్రీః
# శ్రీరాజరాజేశ్వర్యష్టకమ్



శ్లో॥ అంబా శాంభవి చంద్రమౌళిరబలాஉపర్ణా ఉమా పార్వతీ
కాళీ హైమవతీ శివా త్రినయనీ కాత్యాయనీ భైరవీ ।
సావిత్రీ నవయౌవనా శుభకరీ సామ్రాజ్యలక్ష్మీప్రదా
*చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీరాజరాజేశ్వరీ!* ॥ 1

శ్లో॥ అంబా మోహిని దేవతా త్రిభువనీ (ఆ)యానందసంధాయినీ
వాణీపల్లవపాణివేణుమురళీగానప్రియాలోలినీ ।
కల్యాణీ ఉడురాజబింబవదనా ధూమ్రాక్షసంహారిణీ
*చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీరాజరాజేశ్వరీ* ॥ 2

శ్లో॥ అంబా నూపురరత్నకంకణధరీ(రా) కేయూరహారావళీ
జాతీపంకజవైజయంతిలహరీగ్రైవేయ కైరాజితా ।
వీణావేణువినోదమండితకరా వీరాసనే సంస్థితా
*చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీరాజరాజేశ్వరీ* ॥ 3

శ్లో॥ అంబా రౌద్రిణి భద్రకాళి భగళా జ్వాలాముఖీ వైష్ణవీ
బ్రహ్మాణీ త్రిపురాంతకీ సురసతీ దేదీప్యమానోజ్జ్వలా ।
చాముండా శ్రితరక్ష(క్షా)పోషజననీ దాక్షాయణీ వల్లవీ
*చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీరాజరాజేశ్వరీ* ॥ 4

శ్లో॥ అంబా శూలధనుఃకుశాంకుశధరా(రీ) అర్ధేందుబింబాధరా(రీ)
వారాహీ మధుకైటభప్రశమనీ వాణీరమాసేవితా ।
మాల్యాద్యాసురమూకదైత్యదమనీ మాహేశ్వరీ అంబికా
*చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీరాజరాజేశ్వరీ* ॥ 5

శ్లో॥ అంబా సృష్టివినాశపాలనకరీ అర్యాణి(ణీ) సంశోభితా
గాయత్రీ ప్రణవాక్షరామృతసరఃపూర్ణానుసంధీకృతా ।
ఓంకారీ వినుతా సురార్చితపదా ఉద్దండదైత్యాపహా
*చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీరాజరాజేశ్వరీ ॥* **6**

శ్లో॥ అంబా శాశ్వతి కా(ఆ)గమాదివినుతా ఆర్యా మహాదేవతా
యా బ్రహ్మాదిపిపిలీకాంతజననీ యా వై జగన్మోహినీ ।
యా పంచప్రణవా ద్విరేఫజననీ యా చిత్కళామాలినీ
*చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీరాజరాజేశ్వరీ ॥* **7**

శ్లో॥ అంబా పాలితభక్తరాజిరనిశం అంబాష్టకం యః పఠే-
దంబాలోకకటాక్షవీక్షకలితా ఐశ్వర్యమవ్యాహతమ్ ।
అంబాపావనమంత్రరాజపఠనాదంతే చ మోక్షప్రదా
*చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీరాజరాజేశ్వరీ ॥* **8**



శ్రీః

# శ్రీరాజరాజేశ్వర్యష్టకమ్

శ్లో॥ **అంబా శాంభవి చంద్రమౌళిరబలాఽ పర్ణా ఉమా పార్వతీ**
**కాళీ హైమవతీ శివా త్రినయనీ కాత్యాయనీ భైరవీ ।**
**సావిత్రీ నవయౌవనా శుభకరీ సామ్రాజ్యలక్ష్మీప్రదా**
***చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీరాజరాజేశ్వరీ!*** ॥ **1**

**ప్రతిపదార్థము :** అంబా = తల్లి, శాంభవి = శంభుపత్ని, చంద్రమౌళిః = చంద్రశేఖరురాలు, అబలా = స్త్రీరూపము గలది లేదా అ = పరమేశ్వరునికి బలరూపమయినది, అపర్ణా = ఆకులుగూడా తినకుండా తపస్సు చేసినది, ఉమా = తల్లి వద్దనినను వినకుండా శివసాధనకై తపస్సు చేసినది, లేదా దేవీ ప్రణవమయిన ఉమా రూపము గలది, పార్వతీ = పర్వతరాజ పుత్రి అయినది. కాళీ = నల్లనిది, కాలస్వరూపురాలయినది, హైమవతీ = హిమవంతుని కూతురయినది, శివా = శివ స్వరూపమయినది, త్రినయనీ = మూడుకన్నులు గలది లేదా త్రినయనుని భార్య అయినది, కాత్యాయనీ = కాత్యాయనమునికి కూతురయి పుట్టినది, భైరవీ = భయంకరమయినది లేదా భైరవుని పత్ని అయినది, సావిత్రీ = సవిత అయిన సూర్యునిశక్తి అయినది, నవయౌవనా = క్రొత్తగా వయసులోనికి వచ్చినది అనగా షోడశి, శుభకరీ = శుభములను కలిగించునది, సామ్రాజ్యలక్ష్మీప్రదా = సామ్రాజ్యసంపద నిచ్చునది. **చిద్రూపీ/పా = జ్ఞానస్వరూపురాలు లేదా జ్ఞానస్వరూపునికి పత్ని, జ్ఞానప్రసూనాంబ, పరదేవతా = పరదేవత, భగవతీ = షడైశ్వర్యములు గలది, శ్రీరాజరాజేశ్వరీ = యక్షుడయిన కుబేరునికి అధిపతి, లేదా శ్రీం బీజముతో కూడిన పంచదశీమంత్రదేవత, లేదా రాజాధిరాజులకే ఈశ్వరురాలు.**

**భావము :** దేవీనామములన్ని కమ్మగా గుదిగుచ్చి చింతన చేయుటయే ఈ స్తోత్రహృదయము. అంబ, శంభుపత్ని, విష్ణుబలశక్తి, అపర్ణ, ఉమ, పర్వతపుత్రి, అనగా హైమవతి, కాళి, శివ, త్రినేత్రుని పత్ని త్రినేత్రురాలు, కాత్యాయని, భైరవి, సావిత్రి, షోడశి, శుభప్రద, సామ్రాజ్యసంపదల నివ్వగల శక్తి, **ఆమెయే చిద్రూప, పరదేవత, పరబ్రహ్మమహిషి, భగవతి, శ్రీరాజరాజేశ్వరి.** భగవతి అనగా జీవుల ఉత్పత్తి-లయము, ఆగతి-గతి, విద్య-అవిద్యలు తెలిసిన శక్తి.

**విశేషములు :** 1. సర్వదేవీనామసంకీర్తనమే యీ స్తోత్రపరమార్థము. కనుక అందువలన అనేక అవతారచరిత్రలను దృష్టిలో ఉంచికొని, యీ పేర్లన్నీ మాలగా అల్లబడినవి.

2. ఇందులో శాంభవీ = శాంభవి అయినది అనగా వ్యాకరణదోషము. కాని 'నామైకదేశే నామగ్రహణమ్" అని 'ఈ' ని వదలి అంతవరకే పరిగ్రహించినట్లు భావించవచ్చును. దీనిని సంబోధనగా భావించుట లేదా "నదిసుత" లాగా హ్రస్వంగా సమాసాశ్రయ విధిగా భావించడం అహేతుకము. లేదా 'అపిమాషం మషం కుర్యాత్ ఛందోభంగం న కారయేత్' అనుకోవచ్చును.

3. ఈ శ్లోకాలలో 'చిద్రూపీ' మొదలగు "ఈ"కారాంతములుకాని వాటిని/ ఆకారాంతములుగా ఉండవలసిన వాటిని – ఈ కారాంతములుగా చెప్పటం వ్యాకరణవిరుద్ధమే. అయినను మంత్ర తంత్ర జ్యోతిష స్థలపురాణ, పురాణాదులలో ఆర్షగ్రంథములలోను అట్టి ప్రయోగాలున్నవి. ఇచ్చట అమ్మవారి బీజమయిన "ఈం"ను ఎక్కువగా రప్పించుటకు రచయిత అలా చేసి ఉండవచ్చును. "క్లీంకారీ కేవలా గుహ్యా..." (ల,స,నా)

4. అయినను అట్టిచోట్ల స్థితగతిచింతన, న్యాయము కనుక "కృఞ్" ధాతువుకు హేతుతాచ్ఛీల్యాద్యర్థములలో వచ్చు 'ట' ప్రత్యయమునుపయోగించుట మంచిది.

5. మరియు "ఉణాదయో బహుళమ్" "కృత్యల్యుటో బహుళం" మొదలయిన సూత్రము లందలి బహుళ గ్రహణములు యోగవిభాగముల ద్వారా కొంతవరకు సరిచేయవచ్చును. సాధ్యముకానిచోట్ల అక్షరములను మార్చవలసి వచ్చినది.

6. కొన్నిచోట్ల విసంధులున్నాయి. అవీ సంప్రదాయ విరుద్ధములే. కాని 'నామం' సంధిలో కలవకుండా స్పష్టముగా కనబడుటకు అట్లు చేసియుండవచ్చును.

ఉదా : 'అబలాపర్ణా–ఉమా', 'కుశాంకుశధరీ– అర్ధేందుబింబాధరీ' ఇట్టివి సవరించటం కుదరదు. కాని 'సంహితైకపదే నిత్యా' అన్న సూత్రం ప్రకారము ఇవి భిన్న పదములు కనుక తప్పులేదని సరిపుచ్చగలము. ఏకపదే అనగా ఏకపాదమున అను అర్థము గూడా సంప్రదాయమున కనబడుచున్నది. కవుల రచనాశైలియు అలాగే ఉన్నది. అయినను, ఒకే పదముతో రెండు రకాల విధులు వాక్యభేదదోషము. కనుక వ్యాకరణమునకు సంబంధించి నంతవరకు అచ్చట ఛందస్సు విషయము లేదు. కనుక ఏకపాదమున విసంధి వ్యాకరణ దోషము కాదు. సంప్రదాయవిరుద్ధముగా మాత్రమే కనబడుచున్నది.

"పద్మాసనే పద్మ–ఊరూ" శ్రీసూక్తం.

7. కనకధారాస్తవమునందు గూడా "**నమోఽస్తు దేవ్యై భృగునందనాయై**" అనడం సరిగా లేదు. '**భృగునందిన్యై**' అనవలసి యున్నది. దానిని మరోరకంగా సమర్థించవలసినదే. కనుక ఆర్షమనవచ్చును. అట్లే, 'చిద్రూపా' అనుట న్యాయము. కాని చిద్రూపుని భార్య అను అర్థమున "చిద్రూపీ" అనవచ్చును. "త్రిణేత్రీ' వలె.

8. ఇవి శంకరాచార్యకృతమన్న పరిచయ ప్రసిద్ధితోనే వచ్చిన అష్టకములు. అందువలన అవసరమయిన మేరకు సమర్థన అవసరము. ఏమయినా భగవత్పాదుల శైలీగాంభీర్యము నిర్దుష్టత ఇందులో కనబడవు. అయినా దేవీనామచింతన గనుక ముక్తిదాయకము.

9. ఈ అష్టకద్వయమునందున్ను ఈ విషయములను గమనించాలి. అచ్చుటచ్చుట చేయు సవరణలు సమర్థనలు ఇట్టి శుభదృష్టితో ఈ పరంపరాగతస్తోత్రమును మరింత గుణ వంతముగా చూపగలవు.

10. ధ్వని-ధుని-లయ-అన్ని సమానంగా నడిచి చదువువారి మనసులో చక్కని భక్తిభావ మధురమయిన ఆనందాన్ని పండితపామరులకు సమానంగా ఇవ్వడంలో ఈ అష్టకద్వయం సాటిలేనిది. దీని అక్షరరమ్యత అమోఘము. అందుకే యీ ప్రయత్నము. చదివిన వెంటనే ఏదో అర్థమయినట్లుగా ఆస్వాదము కలిగించే శర్కరా పాకము.



**శ్లో॥ అంబా మోహిని దేవతా త్రిభువనీ (ఆ)యానందసంధాయినీ**
**వాణీపల్లవపాణివేణుమురళీగానప్రియాలోలినీ ।**
**కల్యాణీ ఉడురాజబింబవదనా ధూమ్రాక్షసంహారిణీ**
***చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీరాజరాజేశ్వరీ ॥*** **2**

**ప్ర :** అంబా = తల్లి, మోహిని దేవతా = మోహినీ దేవత అయినది లేదా మోహిని, దేవత, త్రిభువనీ = త్రిలోకీస్వరూపమయినది, ఆనందసంధాయినీ = ఆనందమును కలిగించునది, వాణీ = సరస్వతి, లేదా వాణీ = సరస్వతియొక్క, పల్లవపాణి = చిగురాకులవంటి చేతులందలి, వేణుమురళీ = వెదురుసంబంధమయిన పిల్లనగ్రోవియొక్క, గాన = గానమునకు, ప్రియా = ప్రియమయినది మరియు లోలినీ = చంచలమయినది (తల ఊపునది). కల్యాణీ = శుభమయినది, ఉడురాజ = చంద్రునియొక్క, బింబ = బింబమువంటి, వదనా = ముఖము కలది, ధూమ్రాక్ష = ధూమ్రాక్షుడను రాక్షసుని, సంహారిణీ = సంహరించునది, -చిద్రూపీ/చిద్రూపా....

**భా :** అమ్మ, మోహినీ స్వరూపమయిన నారాయణశక్తి దేవత, ముల్లోకములే స్వరూపముగా

గలది. ఆనందకరమయినది, సరస్వతీరూపము, సరస్వతీకృతమయిన వేణువీణాదిగాన ప్రియురాలు, కల్యాణమూర్తి అనగా హిరణ్మయి, చంద్రబింబముఖి, ధూమ్రాక్షసంహారిణి అయిన దుర్గ, అయిన ఆ చిద్రూప పరదేవత...

**వి :** 1. త్రిభువనీ = పదము తప్పు. నకారోపధగల ద్విగువుకు "జీప్" రాదు. కనుక త్రిభు అనగా మూడులోకములను, అడవి అని అర్థము సర్దవలెను. త్రిభువనికి ఆనందము కలిగించునదని చెప్పవలెను. కాని సంధితప్పదు. కనుక "త్రిభువనీయానంద' అనగా, ముల్లోకముల ఆనందహేతు వనదగును.

---

**శ్లో॥ అంబా నూపురరత్నకంకణధరీ(రా) కేయూరహారావళీ**
**జాతీపంకజవైజయంతిలహరీగ్రైవేయ కైరాజితా ।**
**వీణావేణువినోదమండితకరా వీరాసనే సంస్థితా**
***చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీరాజరాజేశ్వరీ ॥*** **3**

**ప్ర :** అంబా = అమ్మ, నూపుర = అందెలను, రత్నకంకణ = రతనాల గాజులను, ధరీ(రా) = ధరించినది, కేయూర = వంకీలు, హారావళీ = రకరకాల ముత్యాల హారములు, జాతీ = జాజి, పంకజ = పద్మములతోగూడిన, వైజయంతి = పంచరంగుల దండల, లహరీ = ప్రవాహరూపము లయిన, గ్రైవేయకైః = మెడసొమ్ములతో (కంటెతో), రాజితా = ప్రకాశించునదియు, వీణా వేణు = వీణా వేణు స్వరూపమయిన, వినోద = వినోదసాధనములచేత, మండిత = అలంకరింపబడిన, కరా = చేతులు గలదియు, వీరాసనే = వీరాసనమునందు, సంస్థితా = ఉన్నదియు, చిద్రూపీ....

**భా :** అంబ, అందెలు గాజులు, కేయూరములు హారములు, జాజులుపద్మములు మొదలగు పంచరంగుల దండల కాంతి ప్రవాహముతో ఏర్పడిన మెడసొమ్ములను ధరించిన మహామహిళా సౌందర్యనిధి, మాణిక్యవీణావేణుమృదంగాదివాద్యవినోదములతో అందగించిన చేతులుగల సంగీతనాదమూర్తి, వీరాసనస్థితురాలయిన స్వతంత్రవీరశక్తి, చిద్రూప....

**వి :** 1. కంకణధరా = ఉండాలి, కంకణధరీ కుదరదు. కాని పరంపరలో 'ధరీ' ఉంటున్నది. ఏ బహుళగ్రహణంతోనో సర్దాలి.

2. **గ్రైవేయ కైరాజితా** – 'వైరాజితా' కుదరదు. 'విరాజితా' కుదురుతుంది. కాని ఛందస్సు పోతుంది. గ్రైవేయంకన్న 'గ్రైవేయక' పదం ప్రసిద్ధము. పైన హారసంఖ్య ఎక్కువే ఉన్నది గనుక "గ్రైవేయకైః" అనటం సబబు. శుద్ధము. సంధిలో సున్నాలు లోపిస్తాయి.

---

**శ్లో॥ అంబా రౌద్రిణి భద్రకాళి భగళా జ్వాలాముఖీ వైష్ణవీ**
**బ్రహ్మాణీ త్రిపురాంతకీ సురసతీ దేదీప్యమానోజ్జ్వలా ।**
**చాముండా శ్రితరక్ష(క్షా)పోషజననీ దాక్షాయణీ వల్లవీ**
***చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీరాజరాజేశ్వరీ ॥*** **4**

**ప్ర :** అంబా = అమ్మ, రౌద్రిణి = రుద్రశక్తి, భద్రకాళి = భద్రమయిన కాళి (రౌద్రకాళికాదు) బగళా = బగళాముఖి అను మహావిద్యాశక్తి, జ్వాలాముఖి = జ్వాలాముఖి, వైష్ణవి = విష్ణుశక్తి, బ్రహ్మాణి = బ్రాహ్మి, త్రిపురాంతకీ = త్రిపురాలను అంతముచేసిన పురహరునిశక్తి, సురసతీ = దేవస్త్రీలచేత, దేదీప్యమానా = నీరాజనలచేత లేదా, వారిసాహచర్యముచేత బాగా వెలిగిపోవుచున్నది, (దాసీభూతసమస్తదేవవనితాం–లాగా) , ఉజ్జ్వలా = కనుక జ్వలించునది, చాముండా = చండముండాసురులను చంపినదియు, శ్రిత = ఆశ్రితులను, రక్ష = రక్షించునట్టి, పోష = పోషించునట్టి, జననీ = తల్లియు, దాక్షాయణీ = దక్షప్రజాపతి కూతురయిన సతీదేవియు, వల్లవీ = గోపిక అయిన రాధయు ఆమెయే., చిద్రూపీ....

**భా :** అమ్మ రౌద్రశక్తి రుద్రాణి భద్రకాళి, జ్వాలాముఖి, వైష్ణవీశక్తి, బ్రాహ్మి, త్రిపురాంతకురాలు, సురకాంతలచేతి హారతులచేత మెరిసిపోతున్న తల్లి, చండముండాసురులను చంపినది. ఆశ్రితులయిన వారిని రక్షించి పోషించునది. దక్షప్రజాపతి పుత్రిక, గోపికాదేవత అయిన రాధయు ఆమెయే.

**వి :** 1. రౌద్రిణి బదులు రుద్రాణి, రౌద్రి ఉండాలి కాని ఛందస్సు కుదరదు. కాని రౌద్రిణి 'రౌద్రముగలది' అను అర్థమున సాధువు కావాలి. అయినా **రౌద్రిణీ, భద్రకాళీ** – అని ఉండాలి ఛందస్సు కుదరదు. ప్రథమశ్లోకవిశేషములలో చెప్పినట్లు భావించాలి. సురనుతా బదులు సురసతీ అనవచ్చు.

2. శ్రితరక్షపోష = ఇదీ కుదరదు. రక్షా ఉండాలి కాని ఛందస్సు కుదరదు. శ్రితరక్షమయిన పోషణగల తల్లి. అనగా రక్షణ పోషణలు చేయుతల్లి అని సర్దాలి.

3. పల్లవీ = అను పాఠము అర్థరహితం. వల్లవీ = అనగా గోపిక ముఖ్యగోపిక అయిన రాసనాయిక రాధ అనిచెప్పవచ్చును. ఈ శ్లోకములు బ్రహ్మాదిశక్తుల వర్ణన ఉన్నదిగదా! లేదా, దాక్షాయణి – సతీదేవి. ఆమె చిగురించినట్లు పుట్టిన పార్వతి.



శ్లో॥ అంబా శూలధనుఃకుశాంకుశధరా(రీ) అర్ధేందుబింబాధరా(రీ)
వారాహీ మధుకైటభప్రశమనీ వాణీరమాసేవితా ।
మాల్యాద్యాసురమూకదైత్యదమనీ మాహేశ్వరీ అంబికా
చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీరాజరాజేశ్వరీ ॥ 5

ప్ర : అంబా = అమ్మ, శూల = శూలము, ధనుః = ధనుస్సు, కుశ = దర్భ, అంకుశ = అంకుశమును, ధరీ = ధరించునదియు, అర్ధేందుబింబ = అర్ధచంద్రబింబమువలెనున్న, అధరా = క్రిందిపెదవి కలది, వారాహీ = వరాహముఖశక్తియు, మధుకైటభ = మధుకైటభులను, ప్రశమనీ = అణచిన విష్ణుశక్తియు, వాణీరమా = లక్ష్మీసరస్వతులచేత, సేవితా = సేవింపబడినదియు, మాల్యాద్య = మాలి సుమాలి మొదలుగాగల, అసుర = రాక్షసులను, మూకదైత్య = వరాహరూపము ధరించి అర్జున తపస్సును అడ్డుకొనిన మూకాసురుని, దమనీ = అణచిన, మాహేశ్వరీ = మహేశ్వరశక్తియు, అంబికా = పార్వతియు, చిద్రూపీ....

భా : తల్లి, శూలము, ధనుస్సు, కుశము, అంకుశము ధరించినదియు, అర్ధచంద్రబింబమువలె కొనలు దేరిన అధరోష్ఠముగలదియు, వారాహి అనబడు దండనాథ, మధుకైటభులను చంపుటలో విష్ణువునకు సహాయపడిన కాళి లేదా విష్ణుశక్తియు, సచామరరమావాణీసేవితురాలు, మాలి మొదలగు అసురులను, మూకదైత్యుని అణచివేసినదియు, అయిన మహేశ్వరశక్తి అయిన అంబిక, చిద్రూపి....

వి : 1. అర్ధేందుబింబాధరీ = అనగా అర్ధేందుబింబమును ఆ-ధరించినది - అని చెప్పాలి. ఉదయించు అర్ధచంద్రబింబమువంటి అధరముగలది - అనటం క్రొత్తదనము.

2. మల్లాద్యాసుర - అని పాఠము. కాని మల్లాసురుని విషయము కనబడలేదు. కనుక 'మాలి' మొదలగు అసురులను చంపిన శక్తిగా సవరణ.



శ్లో॥ అంబా సృష్టివినాశపాలనకరీ అర్యాణి(ణీ) సంశోభితా
గాయత్రీ ప్రణవాక్షరామృతసరఃపూర్ణానుసంధీకృతా ।
ఓంకారీ వినుతా సురార్చితపదా ఉద్దండదైత్యాపహా
చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీరాజరాజేశ్వరీ ॥ 6

ప్ర : అంబా = తల్లి, సృష్టివినాశపాలన = సృష్టిస్థితిప్రలయములను, కరీ = చేయునది. అర్యాణీ = స్వామిని, సంశోభితా = ప్రకాశించినది, గాయత్రీ = గాయత్రీదేవి, ప్రణవాక్షర = ఓంకారమను,

అమృతసరః = అమృతసరస్సుతో, పూర్ణ = సంపూర్ణముగా, అనుసంధీకృతా = అనుసంధానము చేయబడినదియు, ఓంకారీ = ఓంకారస్వరూపురాలుగా, వినుతా = కీర్తింపబడినదియు, సుర = దేవతలచేత, అర్చిత = పూజింపబడిన, పదా = చరణములుగలదియు, ఉద్దండ = మహావీరులయిన, దైత్య = రాక్షసులను, అపహా = తొలగించునదియు, చిద్రూపీ...

**భా :** తల్లి, సృష్టిస్థితిప్రళయకారకురాలు. ప్రపంచస్వామిని, (అర్యః = స్వామి), గాయత్రి, ప్రణవ సుధాసరస్సుతో పూర్ణానుసంధానము చేయబడినదియు, ఓంకారస్వరూపురాలు, దేవతాపూజిత చరణములు గలది, ప్రచండదైత్యసంహారిణి చిద్రూపీ...

**వి :** 1. 'అర్యాణీ' అని పదము. 'అర్య' అనగా స్వామి అని అర్థము. 'అయ్య' అను తెలుగుపదమునకు ఇది మూలకం. ఆర్య పదము వేరు. అర్య పదము వేరు. 'ఆర్యా' అనగా పార్వతి. ఆర్యాణి లేదు. కనుక అర్యాణీ = అర్యాణి అన్నారు. "అర్యక్షత్రియాభ్యాం వా స్వార్థే" అర్యా, అర్యాణీ = యజమానురాలు, స్వామిని.

2. అమృతరసః పూర్ణా – కుదరదు. రసైః పూర్ణా అనాలి. అంతకన్న 'సరః' మంచిది. ఓంకారీ = క్లీంకారీ (లసనా) లాగా.



**శ్లో॥ అంబా శాశ్వతి కా(ఆ)గమాదివినుతా ఆర్యా మహాదేవతా**
**యా బ్రహ్మాదిపిపీలికాంతజననీ యా వై జగన్మోహినీ ।**
**యా పంచప్రణవా ద్విరేఫజననీ యా చిత్కళామాలినీ**
***చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీరాజరాజేశ్వరీ ॥*** **7**

**ప్ర :** అంబా = మాత, శాశ్వతి(తీ) = శాశ్వతమయిన, ఆగమాది = వేదశాస్త్రాదులచేత, వినుతా = కీర్తింపబడినది, ఆర్యా= పార్వతి, మహాదేవతా = గొప్పదేవత, యా = ఏ తల్లి, బ్రహ్మాది = బ్రహ్మమొదలు, పిపీలికాంత = 'చీమ' అవధిగాగల, ప్రపంచమునకు, జననీ = తల్లి అయినదో, యావై = ఏ తల్లి, జగన్మోహినీ = విష్ణ్వవతారమయిన మోహినియో. యా = ఎవరు, పంచప్రణవా = ఐదు ప్రణవములుగలదియో, ద్విరేఫజననీ = భ్రమరాంబికయో, యా = ఎవరు, చిత్కళామాలినీ = జ్ఞానకళామాలికయో ఆమె, చిద్రూపీ....

**భా :** అంబ, ఆద్యంతరహితురాలు, వేదశాస్త్రాదికీర్తితురాలు, ఆర్య, మహాదేవత, కనుకనే బ్రహ్మాది పిపీలికాంతముగా సర్వప్రపంచమునకు జనని, జగన్మోహినీదేవి, "**ఐంక్లీంసౌః శ్రీంహ్రీం**" అను పంచప్రణవములు గలది, ద్విరేఫజననీ అనగా భ్రమరాంబిక, అనగా భ్రమరులయిన జీవులకు

మాత, జ్ఞానకళాసమూహరూప అనగా మతి ప్రజ్ఞా, స్మృతి మొ॥ చిత్కళలు ఆమె అంశలే. ఆమెయే చిద్రూపి...

**వి :** 1. **శాశ్వతీ** – కాని 'శాశ్వతి' అని ఉన్నది విసంధి. కారణమింతకుముందు చెప్పినదే. లేదా, శాశ్వతికాగమాది అనవచ్చును. అలాగయితే శాశ్వతికా – ఆగమాది, అని అర్థము విసంధిదోషము గూడా తొలగును. పంచప్రణవాదిరేఫజననీ– అనుపాఠం అర్థరహితం. కనుక 'ద్వి' అని సవరణ.

**శ్లో॥ అంబా పాలితభక్తరాజిరనిశం అంబాష్టకం యః పఠే–**
**దంబాలోకకటాక్షవీక్షకలితా ఐశ్వర్యమవ్యాహతమ్ ।**
**అంబాపావనమంత్రరాజపఠనాదంతే చ మోక్షప్రదా**
***చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీరాజరాజేశ్వరీ ॥*** **8**

**ప్ర :** అంబా = శ్రీమాత, పాలిత = పాలింపబడిన, భక్తరాజిః = భక్తసమూహము గలది, యః = ఎవడు, అనిశమ్ = నిత్యము, అంబాష్టకమ్ = ఈ రాజరాజేశ్వర్యష్టకమును, పఠేత్ = చదువునో, వానికి, అంబాలోక = తల్లిచూపులుగానున్న, కటాక్షవీక్ష = కటాక్ష వీక్షణములతో, కలితా = కూడినదై, ఆ తల్లి, అవ్యాహతమ్ = అక్షతమయిన, ఐశ్వర్యమ్ = ఐశ్వర్యమును ఇచ్చును. అంబా = ఆ తల్లియొక్క, పావన = పవిత్రమయిన, మంత్రరాజ = పంచదశీ/షోడశీమంత్రమును, పఠనాత్ = చదువుట వలన, అంతే = చివరకు, మోక్షప్రదా చ = మోక్షమునున్ను ఇచ్చును. ఆమెయే చిద్రూపీ...

**భా :** అంబ భక్తపాలనబద్ధకంకణ, అందువలన ఈ అంబాష్టకమును చదివిన వారిని ఆమె "తల్లిచూపులు"గల కటాక్షములతో ఐశ్వర్యమును ప్రసాదించును. పావనమయిన అంబా మంత్రమయిన పంచదశీ, షోడశీ, రాజరాజేశ్వరీ, సౌభాగ్యవిద్యేశ్వరీ, లలితాసహస్రనామాది మంత్రములను పఠించిన భక్తునకు చివరకు మోక్షమును గూడా ఇచ్చును. ఆమెయే చిద్రూపీ...

శ్రీః

శ్రీః

# శ్రీఅన్నపూర్ణాష్టకమ్

శ్లో॥ నిత్యానందకరీ వరాభయకరీ(రా) సౌందర్యరత్నాకరీ(రా)
నిర్ధూతాఖిలఘోరపాపనికరా ప్రత్యక్షమాహేశ్వరీ ।
ప్రాలేయాచలవంశపావనకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాఽన్నపూర్ణేశ్వరీ ॥ 1

శ్లో॥ నానారత్నవిచిత్రభూషణకరా హేమాంబరాడంబరా
ముక్తాహారవిడంబమానవిలసద్వక్షోజకుంభాంతరా ।
కాశ్మీరాగరువాసితాంగరుచిరా కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాఽన్నపూర్ణేశ్వరీ ॥ 2

శ్లో॥ యోగానందకరీ రిపుక్షయకరీ ధర్మైకనిష్ఠాకరీ
చంద్రార్కానలభాసమానలహరీ త్రైలోక్యరక్షాకరీ ।
సర్వైశ్వర్యకరీ తపఃఫలకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాఽన్నపూర్ణేశ్వరీ ॥ 3

శ్లో॥ కైలాసాచలకందరాలయచరీ గౌరీ ఉమా శాంకరీ
కౌమారీ నిగమార్థగోచరఝరీ ఓంకారబీజాక్షరీ(రా) ।
మోక్షద్వారకవాటపాటనకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాఽన్నపూర్ణేశ్వరీ ॥ 4

శ్లో॥ దృశ్యాదృశ్యవిభూతిపాలనకరీ బ్రహ్మాండభాండోదరీ
లీలానాటకసూత్రఖేలనకరీ విజ్ఞానదీపాంకురా(రీ) ।
శ్రీవిశ్వేశమనఃప్రమోదనకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాఽన్నపూర్ణేశ్వరీ ॥ 5

శ్లో॥ ఆదిక్షాంతసమస్తవర్ణనికరా శంభుప్రియా శాంకరీ
కాశ్మీరీ త్రిపురేశ్వరీ త్రినయనీ విశ్వేశ్వరీ శ్రీధరీ ।
స్వర్గద్వారకవాటపాటనకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాఽన్నపూర్ణేశ్వరీ ॥ 6

శ్లో॥ ఉర్వీ సర్వజయేశ్వరీ జయకరీ మాతా కృపాసాగరీ(రా)
నారీ నీలసమానకుంతలధరా నిత్యాన్నదానేశ్వరీ ।
సాక్షాన్మోక్షకరీ సదా శుభకరీ కాశీపురాధీశ్వరీ
*భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాఽన్నపూర్ణేశ్వరీ ॥* **7**

శ్లో॥ దేవీ సర్వవిచిత్రరత్నఖచితా దాక్షాయణీ సుందరీ
వామస్వాదుపయోధరా ప్రియకరీ సౌభాగ్యమాహేశ్వరీ ।
భక్తాభీష్టకరీ వరా శుభకరీ కాశీపురాధీశ్వరీ
*భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాఽన్నపూర్ణేశ్వరీ ॥* **8**

శ్లో॥ చంద్రార్కానలకోటికోటిసదృశీ చంద్రాంశుబింబాధరీ
చంద్రార్కాగ్నిసమానకుండలధరా చంద్రార్కవర్ణే(హీ)శ్వరీ ।
మాలాపుస్తకపాశకాంకుశధరా కాశీపురాధీశ్వరీ
*భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాఽన్నపూర్ణేశ్వరీ ॥* **9**

శ్లో॥ క్షుద్ర(క్షత్ర)త్రాణకరీ మహాభయహరీ మాతా కృపాసాగరీ
సాక్షాన్మోక్షకరీ సదా శుభకరీ విశ్వేశ్వరీ శ్రీధరీ ।
దక్షాక్రందకరీ నిరామయకరీ కాశీపురాధీశ్వరీ
*భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాఽన్నపూర్ణేశ్వరీ ॥* **10**

శ్లో॥ అన్నపూర్ణే! సదాపూర్ణే! శంకరప్రాణవల్లభే! ।
జ్ఞానవైరాగ్యసిద్ధ్యర్థం భిక్షాం దేహి చ పార్వతి! ॥ **11**

శ్లో॥ మాతా చ పార్వతీ దేవీ పితా దేవో మహేశ్వరః ।
బాంధవాః శివభక్తాశ్చ స్వదేశో భువనత్రయమ్ ॥ **12**

శ్రీః

శ్రీః

# శ్రీఅన్నపూర్ణాష్టకమ్

శ్లో॥ నిత్యానందకరీ వరాభయకరీ(రా) సౌందర్యరత్నాకరీ(రా)
నిర్ధూతాఖిలఘోరపాపనికరా ప్రత్యక్షమాహేశ్వరీ ।
ప్రాలేయాచలవంశపావనకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాఽన్నపూర్ణేశ్వరీ ॥ 1

**ప్రతిపదార్థము :** నిత్యానందకరీ = నిత్యమయిన ఆనందమును కలిగించునది, వరాభయకరీ = వరాభయములను కలిగించునది, సౌందర్య = సౌందర్యమునకు, రత్నాకరీ = సముద్రము వంటిది, నిర్ధూత = తిరస్కరింపబడిన, అఖిల = సమస్తమయిన, ఘోర = ఘోరమయిన, పాపనికరా = పాపసమూహముగలది, ప్రత్యక్ష = ప్రత్యక్షమయిన, మాహేశ్వరీ = మహేశ్వర శక్తి రూపమయిన ప్రకృతి, ప్రాలేయాచల = హిమాద్రియొక్క, వంశ = వంశమునకు, పావనకరీ = పవిత్రకరణమయినది, **కాశీపుర = వారణాసీపురమునకు, అధీశ్వరీ = అధిపత్నియు, కృపా = దయతో, దయనే,, అవలంబనకరీ = ఆధారముగా చేయునది, మాతా = తల్లి అయినది, అగు, అన్నపూర్ణేశ్వరీ = అన్నపూర్ణేశ్వరి అనబడు, (త్వమ్) = నీవు, భిక్షామ్ = జ్ఞానభిక్షను, దేహి = ఇమ్ము.**

**భా :** అమ్మా నీవు నిత్యమయిన ఆనందమునిచ్చుదానవు. వరములను అభయములను ఇచ్చుదానవు. సౌందర్యసముద్రమువు. లేదా సౌందర్యనదివి. ఘోరపాపములను, పాపులను పోగొట్టునట్టి, ప్రకృతిరూపముగా ప్రత్యక్షమయిన మహేశ్వరశక్తివి (దేవాత్మ శక్తిం స్వగుణైః నిగూఢామ్) హిమవంతుని వంశమును తనజన్మతో పవిత్రపరచిన **కాశీనగరాధిరాజ్ఞివి. నీ కృపను అవలంబనముగా చేయుదానవు. మాతా! అన్నపూర్ణా! ఈశ్వరీ, నాకు జ్ఞానభిక్షను ప్రసాదింపుము. కృపతో అవలంబనమునిచ్చుదానవు.**

**వి :** 1. ఈ శ్లోకములో అన్ని "రీ" వచ్చినవి. కరమనగా "చేయి" అర్థములో 'రీ' రాదు. 'చేయునట్టిది' అను అర్థములో 'రీ' వచ్చును. లయధుని వరసనుబట్టి, 'రీ' అవసరము. రత్నాకర అనగా సముద్రము. దానికి స్త్రీలింగము 'రత్నాకరా' అని రావలెను. కాని 'రత్నాకరీ' ఉన్నది. రత్నాకరుని భార్య అను అర్థములో 'నది' అనవచ్చును. సౌందర్యనది సౌందర్యలహరి అని అర్థము. శూలినీ, అర్యాణీ వలె – విశేషణముమీదనే జీష్

2. ఘోరపావనకరీ – పాఠము విరుద్ధము. పాపనికరా – సరయినది. ఇక్కడ 'రీ' రాదు. ఒక పాఠము ఇలా ఉన్నది గూడ.

3. ఇందులో అన్ని శ్లోకాలలో 'త్వం' (నీవు) పదమును అధ్యాహారము చేయవలయును. అపుడు నామములన్నియు 'త్వం'కు విశేషణమవుతాయి.

---

**శ్లో॥ నానారత్నవిచిత్రభూషణకరా హేమాంబరాడంబరా**
**ముక్తాహారవిడంబమానవిలసద్వక్షోజకుంభాంతరా ।**
**కాశ్మీరాగరువాసితాంగరుచిరా కాశీపురాధీశ్వరీ**
**భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాఽన్నపూర్ణేశ్వరీ ॥ 2**

**ప్ర :** నానారత్న = వివిధరత్నములవలన, విచిత్ర = చిత్రవర్ణములయిన, భూషణ = సొమ్ములుగల, కరా = చేతులుగలది, హేమాంబర = సువర్ణవస్త్రములు, ఆడంబరా = ఆడంబరముగా గలది, ముక్తాహార = ముత్యాలహారములతో, విడంబమాన = అనుకరించుచు, విలసత్ = ప్రకాశించుచున్న, వక్షోజకుంభ = స్తనకుంభములయొక్క, అంతరా = మధ్యభాగము గలది, కాశ్మీర = కుంకుమ, అగరు = అగరు పదార్థములచేత, వాసిత = సువాసన చేయబడిన, అంగ = అవయవములచేత, రుచిరా = వెలుగులీనునదియు, కాశీపురాధీశ్వరీ....

**భా :** వివిధరత్నములతో చిత్రవర్ణములయిన హస్తభూషణములు గలది, బంగారు వస్త్రములను ధరించి ఆడంబరముగా నున్నది, ముత్యాలహారములతో అనుకరణగా తెల్లని స్వచ్ఛమయిన స్తనమధ్యసీమగలది, కుంకుమ అగరు కస్తూరివంటి సువాసనద్రవ్యములతో శోభించు అవయవములు గలది. (తాం పద్మినీం) కాశీపురాధీశ్వరి అయిన నీవు...

**వి :** 1. ఇందులో 'రీ' రావటం మరీ విడ్డూరం. 'ఆ' వస్తుంది. అదిగూడ స్త్రీ ప్రత్యయమే.

2. విడంబమానవిలసత్' – గొప్పపదం కాదు. అందువలన అందుకు తగినట్లు అర్థము చెప్పవలసి వచ్చినది. అనగా 'తెల్లని' వక్షస్థలము. కాని సంప్రదాయమయితే 'ఎరుపు' చెప్పాలి. సువాసినీ–వక్షస్థలము కుంకుమచందనములు గలదిగదా! పైగా దేవి కురువిందవర్ణ. మాణిక్యకాంతి. విమర్శ్యారుణ. లేదంటే ఇచ్చట 'సరస్వతి' అని భావించెదము. లేదా ముత్యాలవంటి స్తన్యబిందువులు అంతరమందుగల స్తనకుంభవతి అని తల్లిగా చెప్పవచ్చు.

---

**శ్లో॥ యోగానందకరీ రిపుక్షయకరీ ధర్మైకనిష్ఠాకరీ**
**చంద్రార్కాలనభాసమానలహరీ త్రైలోక్యరక్షాకరీ ।**
**సర్వైశ్వర్యకరీ తపఃఫలకరీ కాశీపురాధీశ్వరీ**
**భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాఽన్నపూర్ణేశ్వరీ ॥ 3**

**ప్ర :** యోగానంద = యోగమును, యోగానందమును, కరీ = కలిగించునది (కుండలిని), రిపు = శత్రువులను, కామక్రోధాదులను, క్షయకరీ = క్షయము చేయునది, ధర్మ = ధర్మమునందు, ఏకనిష్ఠా = కేవలనిష్ఠను, కరీ = కలిగించునది, చంద్రార్కానల = చంద్రసూర్యాగ్నులయందు, భాసమాన = ప్రకాశించుచున్న, లహరీ = కాంతిప్రవాహమయినది, త్రైలోక్య = (అట్టి కాంతి లహరిచే) ముల్లోకములను, రక్షాకరీ = రక్షించునది, సర్వ = సమస్తమయిన, ఐశ్వర్య = విద్యాసంపత్ మొదలగు ఐశ్వర్యములను, కరీ = కలిగించునది, తపఃఫల = తపఃఫలితములను, కరీ = కలిగించునదియు అయిన, కాశీపురా...

**భా :** యోగమును యోగానందములను ప్రసాదించునది, శత్రు, అంతశ్శత్రుక్షయముచేయునది, కేవలధర్మమునందే ఆసక్తిని వరముగా నీయగలది, చంద్రాగ్నిసూర్యుల తేజోరూపమయినది, అట్టి తేజోలహరితో ముల్లోకములను కాపాడునది, సమస్తవిధ – ఐశ్వర్యములను ఇచ్చునది, తపస్సులకు ఫలమును అనుగ్రహించునది, కాశీపురసమ్రాజ్ఞి....

**వి :** 1. చంద్రసూర్యాగ్ని తేజములు దేవీతేజములే. – తత్తేజోవిద్ధిమామకమ్ – గీత. "తస్యభాసాసర్వమిదం విభాతి – శ్రుతి.

2. యోగానందము కుండలినీ రూపమయిన పరదేవతవలననే సాధ్యము.

3. తపఃఫలకరీ – 'వైరోచనీం కర్మఫలేషు జుష్టాం"



**శ్లో॥ కైలాసాచలకందరాలయచరీ గౌరీ ఉమా శాంకరీ**
**కౌమారీ నిగమార్థగోచరఝరీ ఓంకారబీజాక్షరీ(రా) ।**
**మోక్షద్వారకవాటపాటనకరీ కాశీపురాధీశ్వరీ**
***భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాఽన్నపూర్ణేశ్వరీ ॥*** **4**

**ప్ర :** కైలాసాచల = కైలాసపర్వతముయొక్క కందరా = గుహ అను, ఆలయ = ఆలయమునందు, చరీ = చరించునది, గౌరీ = పచ్చనిది, ఉమా = దేవీప్రణవరూపమయినది, తల్లివద్దన్నను (ఉ+మా) తపస్సు చేసి శివుని సాధించినది, శాంకరీ = శంకర శక్తి, కౌమారీ = కుమారశక్తి అయినది లేదా బాలాశక్తి, నిగమార్థ = వేదాంతములను, గోచరక(ఝ)రీ = గోచరించునట్లు చేయు ప్రవాహము, ఓంకారబీజా = ఓంకారబీజస్వరూపమయినది లేదా ఓంకారమునకు బీజమయినది, అక్షరీ = అక్షరునకు పత్ని అయినది, మోక్షద్వార = ముక్తిద్వారమయిన బ్రహ్మరంధ్రముయొక్క కవాట = తలుపయిన మూలాధారమును, పాటనకరీ = భేదించునట్టిది, కాశీపురాధీశ్వరీ...

**భా :** కైలాసపర్వతముయొక్క గుహాలయమున సంచరించునది, గౌరి, ఉమా, శంకరశక్తి, కుమార

శక్తి దేవసేన, శ్రీవల్లి, బాల, వేదాంతార్థమును గోచరము చేయునట్టిది, ఓంకారమునకే బీజమైన నాదశక్తి, అక్షరుడయిన పరబ్రహ్మమునకు మహిషి = పరబ్రహ్మమహిషి, తురీయ, ముక్తిద్వార కవాటమును తెరచునట్టి తాళపుచెవి, అయిన కాశీపురాధీశ్వరి...

**వి :** 1. ఈ శ్లోకము ఎక్కువగా కుండలినీ శక్తి విలాసమునకు చెందియున్నది. గౌరీ = పీతాభాస్వత్యణూపమా. కైలాసము = వెన్నుబద్ద దాని గుహ సుషుమ్నాకాశము. అందులో చరించునది, నిగమార్థము = పరబ్రహ్మము, గోచరఝరీ = ఆయనయే లక్ష్యముగా ప్రవహించు నాదఝరి., ఓంకారబీజా = కనుకనే ఓంకార రూప (అ–ఉ–మ) త్రివిధవర్ణములకు బీజమయిన నాదశక్తి. మోక్షద్వార = ముక్తిద్వారము మూలాధారము. దానిని దేవమార్గమనెదరు. ఆ ద్వారమును తలతో ఆవరించి కుండలిని నిద్రించును. యోగశక్తితో, బహుజన్మార్జితపుణ్యముతో ఆమె నిద్రలేచిననే మోక్షము సిద్ధించవచ్చును. **ముక్తిద్వారము తల్పుతీయగదె! చాముండా జగజ్జననీ** – పాపయారాధ్య.

2. కందరాలయకరీ = అర్థము బాగుండదు. కందరను ఆలయముగా చేసినది. ఈ సమాసము సమర్థముగా లేదు. కనక 'చరీ' అని కూర్చుట మంచిది.

3. నిగమార్థగోచరఝరీ – ఇదీ అంతే. నిగమార్థమయిన బ్రహ్మమును గోచరమునుగా చేయునది – ఇలారాదు. కనుక "గోచరఝరీ" అని మార్చుట మంచిది. నిగమార్థముగోచరముగా గల ప్రవాహము. పైగా ఈ "కరీ" పదము చాలాసార్లు వచ్చినదే. సుషుమ్నను సరస్వతీనదిగా చెప్పారు గనుక "ఝరీ" అనదగును.

4. ఓంకారబీజాక్షరా – అనవలెను. 'రీ' రాదు. కనుక అక్షరీ = అక్షరస్యపత్నీ – అని అక్షర పరబ్రహ్మమహిషిగా చెప్పటం మంచిది. 'నాదశక్తి' గా ఆమె ఓంకారమునకు బీజము. మరియు త్రిలోకస్వరూపమయిన ఓంకారమునకు ఆమె సృష్టిస్థితిసంహారనాయికగా, మాయాశక్తిగా బీజమే. ఓమ్–లో మకారముమీదనున్న అర్ధమాత్రారూపమయిన నాదశక్తి ఆమె. పైనుంచి బీజము. క్రిందనుంచి ఫలము. కనుక 'రీ' అనవచ్చును.

5. గౌరీహ్యుమా = అన్న పాఠం అనవసరము. విసంధులు ఎటూ ఉన్నవి. ఇక్కడ ఒక్కచోట 'హి' పెట్టి విసంధిని తొలగించటం అనవసరం. ఏకపదముగాదు కనుక సంధి నిత్యము కాదు. "గౌరీ – ఉమా" అనటమే సరి.

6. ఉమా – ఉ– ఓ పార్వతీ, మా = తపస్సు వద్దు అని మేనక చెప్పినను వినక తపస్సు చేసినదని ఆమెకు "ఉమా" అనిపేరు. మరియు 'ఓం'ను విడదీస్తే 'అ+ఉ+మ్' ఇందలి 'అ'ను చివరకు వేస్తే 'ఉమా' అగును. ఇది దేవీప్రణవము.



శ్లో॥ దృశ్యాదృశ్యవిభూతిపాలనకరీ బ్రహ్మాండభాండోదరీ
లీలానాటకసూత్రఖేలనకరీ విజ్ఞానదీపాంకురా(రీ) ।
శ్రీవిశ్వేశమనఃప్రమోదనకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాఽన్నపూర్ణేశ్వరీ ॥ 5

ప్ర : దృశ్య = కనబడే, అదృశ్య = కనబడని, విభూతి = సిద్ధులను వైభవములను, పాలనకరీ = పాలించునది, బ్రహ్మాండ = బ్రహ్మాండములకు, భాండ = భాండాగారమయిన, ఉదరీ = ఉదరముగలది, లీలానాటక = విలాసరూపమయిన జగన్నాటకమునకు, సూత్రఖేలనకరీ = సూత్రధారపాత్రగా క్రీడచేయునది, విజ్ఞానదీపాంకురా = బుద్ధిరూపమయిన అంకురదీపములు గలది, శ్రీ విశ్వేశ = శ్రీ విశ్వేశ్వరునియొక్క, మనః = మనస్సునకు, ప్రమోదనకరీ = ఆనందమును కల్గించునది, కాశీపురా....

**భా :** దృశ్యమయిన ప్రపంచవిభూతులు భూమిజలతేజస్సులు, తేజోబన్నములు, అదృశ్యమయిన అణిమాది విభూతులు, ఆకాశవాయ్వాది భూతములు, వీటిని పాలించునది. బ్రహ్మాండములకు భాండాగారమయిన ఉదరము కలది. లీలారూపమయిన జగన్నాటకమునకు సూత్రధారి, విజ్ఞానదీపాంకురాన్విత, కాశీవిశ్వేశ్వరశ్రీమన్మహాదేవుని అంతరంగప్రియ, కాశీసమ్రాజ్ఞి....

**వి :** 1. సత్-అనగా అగ్ని, జలపృథివీత్రయము. అసత్ లేదా త్యత్ = అనగా ఆకాశవాయు ద్వయము. అని ఒక అర్థము. అవే దృశ్యాదృశ్య విభూతులు. ఇవిగాక అణిమాది సిద్ధులు, ఇంకా విజ్ఞానాదిసృష్టి అదృశ్యవిభూతి. ప్రపంచమునందు కనబడేది దృశ్యవిభూతి. దేవాదులు అదృశ్యవిభూతి. మానవాదులు దృశ్యవిభూతి. దేవతలు, అగ్ని మొదలగు దృశ్యాదృశ్య విభూతులు. మధ్యలో కనబడును. తరువాత అదృశ్య మగును. ఇట్టి సమస్తప్రకృతిదృశ్యములను పాలించునది. ఇందు, 'పావనకరీ' పాఠము అసంగతము. పావనము చేయటమనటం కుదరని అర్థము.

2. బ్రహ్మాండభాండములు అనటం ఒక సంప్రదాయము. ఆ అర్థములో సమాసము సరిగాదు. కనుక బ్రహ్మాండములకు భాండమయిన ఉదరము గలది – సరిపోతుంది – మండోదరీ – లాగా – కృశోదరీ లాగా.

3. లీలానాటక ఇందు జగన్నాటకమని అర్థం చెప్పక తప్పదు.

4. విజ్ఞానదీపాంకురా – ఆమెయే జ్ఞానదీపము. లేదా ఈశ్వరుని విజ్ఞానదీపము – ఆమె నుండి బుద్ధి భేదరూపములయిన మనవిజ్ఞానదీపములు వచ్చినవి. కనుక ఆమె విజ్ఞానదీపాంకురము కాదు. విజ్ఞానదీపములే అంకురములుగా గలది. ఆ అంకురములు మనబుద్ధి భేదములై. అంకురీ' కుదరదు.



**శ్లో॥ ఆదిక్షాంతసమస్తవర్ణనికరా శంభుప్రియా శాంకరీ
కాశ్మీరీ త్రిపురేశ్వరీ త్రినయనీ విశ్వేశ్వరీ శ్రీధరీ ।
స్వర్గద్వారకవాటపాటనకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాఽ న్నపూర్ణేశ్వరీ ॥ 6**

**ప్ర :** ఆది = 'అ' మొదలుగా, క్షాంత = క్షకారము అవధిగా నున్న, సమస్తవర్ణనికరా = సమస్తవర్ణసమూహస్వరూపమయిన, నాదశక్తి, శబ్దశక్తి, వాగ్రూప, శంభుప్రియా = హరప్రియ అయినది, శాంకరీ = శంకరశక్తి, కాశ్మీరీ = భారతదేశశిరస్థానమయిన కాశ్మీరపీఠాధిష్ఠాన (సర్వజ్ఞపీఠ) దేవత, లేదా కుంకుమస్వరూపురాలు. త్రిపురా = త్రిపురసముదాయరూపమయినది, ఈశ్వరీ = ఈశ్వరురాలు, ఈశ్వరపత్ని, త్రినయనా(నీ) = మూడుకన్నులుగలది (త్రిపుటిని నడుపునది, త్రినయనుని పత్ని), విశ్వేశ్వరీ = విశ్వేశ్వరపత్ని, శ్రీధరీ = శ్రీధరుడు అనగా విషధరుడయిన శివుని పత్ని, లేదా, శ్రీధరుడు, అనగా లక్ష్మీధరుడయిన విష్ణుని సోదరి అనగా నారాయణి, స్వర్గద్వార = స్వర్గద్వారముయొక్క, కవాట = తలుపులను, పాటనకరీ = భేదించగల కర్మఫలప్రదాత్రి, కాశీపురాధీశ్వరీ...

**భా :** అక్షమాల అనగా "అ" మొదలు "క్ష" వరకు ఉన్న శబ్దరాశికి మూలమయిన నాదశక్తి, చక్రములందు పరచబడిన "అంతర్మాల"గల కుండలినీశక్తి శంభుప్రియ, శంకరశక్తి, కాశ్మీరదేవత, త్రిపుర, త్రిపురేశ్వరి, త్రిలోచన, విశ్వేశ్వరి, నారాయణి, స్వర్గద్వారకవాటములను భేదించి పరలోక సుఖములను ప్రసాదించునది. కాశీపురరాజ్ఞి....

**వి :** 1. ఇంతకుముందు ముక్తిద్వారకవాటపాటనకరీ – అన్నారు. ఇపుడు 'స్వర్గద్వార..." అన్నారు. స్వర్గము యాగాది కర్మఫలము. ముక్తి జ్ఞానఫలము. అమ్మవారు భోగమోక్షఫలప్రదా. "కర్మఫలేషు జుష్టా, తపసా జ్వలంతీ, అగ్నివర్ణా – కదా కనుక స్వర్గప్రదగూడా.

**శ్లో॥ ఉర్వీ సర్వజయేశ్వరీ జయకరీ మాతా కృపాసాగరీ(రా)
నారీ నీలసమానకుంతలధరా నిత్యాన్నదానేశ్వరీ ।
సాక్షాన్మోక్షకరీ సదా శుభకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాఽ న్నపూర్ణేశ్వరీ ॥ 7**

**ప్ర :** ఉర్వీ = భూమాత, గొప్పది, సర్వజయేశ్వరీ= సర్వజయములకు ఈశ్వరురాలు, జయకరీ = జయములు కలిగించునది, మాతా = తల్లి, కృపాసాగరీ = దయాసముద్రురాలు/దయానది, నారీ = స్త్రీమూర్తి, నీల = ఇంద్రనీలమణులతో, సమాన = పోలిన, కుంతల ధరా = వెంట్రుకలు

కలది, నిత్యాన్నదానా = నిత్యము అన్నదానము చేయునది, ఈశ్వరీ = ఈశ్వరురాలు, సాక్షాత్ = నేరుగా, మోక్షకరీ = ముక్తినిచ్చునది, సదా = నిత్యము, శుభకరీ = శుభములు కలిగించునది, కాశీపురాధీశ్వరీ....

**భా :** భూమాత, సర్వజయములకు అధిపతి, జయప్రసాదిని, మాత, కృపాలహరి, పరమస్త్రీ స్వరూప, నీలకుంతలసుందరురాలు, నిత్యము అన్నదానములు చేయునది - ఈశ్వరురాలు లేదా నిత్యాన్నదానములకు ఈశ్వరురాలు, స్వయంగా మోక్షమునీయగల తల్లి, నిత్యము శుభకరురాలు కాశీపురాధీశ్వరి...

**వి :** 1. జయాపజయాలు దైవాధీనము - ఆ దైవం పరాశక్తియే.

2. కృపాసాగరా/రీ. సాగరా అనటం సరి అయినది. కాని సాగరీని సరిచేయవచ్చును. సాగరస్య పత్నీ - సాగరీ అనగా నది. కృపాసాగరీ కృపానది/లహరి. అని చెప్పవచ్చును. లేదా సాగరశబ్దము సగరశబ్దం మీద "అణ్" ప్రత్యయంతో వచ్చినది. దానికి స్త్రీత్వం చెప్పదలచితే (కల్పలతా - అన్నట్లు) సాగరీ - అవుతుంది. 'అణ్'కు జీప్ యుక్తమే.

3. నిత్యాన్నదానేశ్వరీ - అన్నపూర్ణాదేవికదా! ఆమె శివునకు ప్రతి మధ్యాహ్నము భిక్షపెట్టునని కాశీఖండము చెప్తుంది. శివుడు హరివలె సర్వజగద్రూపుడు. కనుక ఆమె నిత్యాన్నదాన. లేదా ఆమె అన్నపూర్ణ కనుక అన్నదానములకన్నింటికి ఆమె అధిదేవత. మనం తినే ప్రతి అన్నపుముద్దకు ఆ అన్నపూర్ణయే అధికారిణి అనవచ్చును. "**అన్నం బ్రహ్మ**"



**శ్లో॥ దేవీ సర్వవిచిత్రరత్నఖచితా దాక్షాయణీ సుందరీ**
**వామస్వాదుపయోధరా ప్రియకరీ సౌభాగ్యమాహేశ్వరీ ।**
**భక్తాభీష్టకరీ వరా శుభకరీ కాశీపురాధీశ్వరీ**
***భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాऽన్నపూర్ణేశ్వరీ ॥*** **8**

**ప్ర :** దేవీ = దేవి, వెలుగునట్టిది, సర్వ = సమస్తమయిన, విచిత్ర = వివిధములయిన, రత్న = రత్నములచేత, ఖచితా = పొదగబడినది, దాక్షాయణీ = దక్షపుత్రిక అయినది, సుందరీ = సుందరమయినది, వామ = ఎడమదయిన, స్వాదు = ఆస్వాదయోగ్యమయిన పయోధరా = స్తనముగలది, ప్రియకరీ = ప్రియములు చేయునది, సౌభాగ్య = సౌభాగ్యములకు లేదా సౌభాగ్యముగల, మాహేశ్వరీ = మహేశ్వరశక్తియు, భక్తాభీష్టకరీ = భక్తులకిష్టములను కల్గించునది, వరా = శ్రేష్ఠమయినది, శుభకరీ = శుభకరమయినది, కాశీపురాధీశ్వరీ...

**భా :** విచిత్రరత్నహారములచేత అలంకరింపబడినది, దక్షపుత్రిక, సుందరి, రుచి అయిన (స్తన్యముకల) ఎడమ స్తనము గలది, ప్రియకరమయినది, సౌభాగ్యప్రదమయిన శ్రీమహేశ్వరి, భక్తాభీష్టప్రద, శుభకరి, వరిష్ఠ, కాశీపురరాజ్ఞి....

**వి :** 1. 'వామా–స్వాదు–' అని ఒక పాఠము – వామస్వాదు – అని ఒకపాఠము. రెండవ పాఠము విశిష్టము. సూర్యచంద్రౌ స్తనౌ దేవ్యాః – అని ఆగమవాక్యము. ఎడమచన్ను చంద్రుడు. అది అమృతబింబము. అందువలన ఎడమచన్ను స్వాదువనటం భావగర్భము. లేదా శివుని అర్ధనారీరూపమునందు దేవి వామపార్శ్వము కనుక "వామా" ఎడమది అని అర్థము. కనుకనే స్వాదు పయోధరా – అయినది. కాని రెండవపాఠము స్పష్టము.



**శ్లో॥ చంద్రార్కానలకోటికోటిసదృశీ చంద్రాంశుబింబాధరీ**
**చంద్రార్కాగ్నిసమానకుండలధరా చంద్రార్కవర్ణే(హే)శ్వరీ ।**
**మాలాపుస్తకపాశకాంకుశధరా కాశీపురాధీశ్వరీ**
**భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాఽన్నపూర్ణేశ్వరీ ॥ 9**

**ప్ర :** చంద్రార్కానల = చంద్రసూర్యాగ్నులయొక్క, కోటికోటి = కోట్లకోట్లతో, సదృశీ = సమానమయిన తేజముగలదియు, చంద్రాంశు = చంద్రకిరణములుగల, బింబాధరీ = దొండపండువంటి పెదవి గలదియు, (లేదా చంద్ర = పచ్చకర్పూరపు అంశు = కిరణము గల బింబాధరీ = దొండపండువంటి పెదవులు గలది), చంద్రార్కాగ్నిసమాన = సూర్యచంద్రాగ్నులతో సమానమయిన, కుండల = కుండలములను, ధరా = ధరించునది, చంద్ర = చంద్రునియొక్క, అర్క = సూర్యునియొక్క, వర్ణా = వర్ణముగలది, ఈశ్వరీ = ఈశ్వరురాలు, మాలా = అక్షమాల, పుస్తక = పుస్తకము, పాశక = పాశము, అంకుశ = అంకుశములను, ధరా = దరించునదియు, కాశీపురా...

**భా :** కోటికోట్ల సూర్యచంద్రాగ్నులతో సమానమయినది. చంద్రకిరణములవంటి దరహాసముగల బింబాధరముగలది. సూర్యచంద్రాగ్ని సమానమయిన కుండలములను ధరించునది. చంద్రార్క వర్ణములకు ఈశ్వరురాలు లేదా చంద్రసూర్యాగ్నులకు ఈశ్వరురాలు. మాలా, పుస్తక, పాశ, అంకుశములను ధరించినది. కాశీపురాధీశ్వరి...

**వి :** 1. చంద్రాంశుబింబాధరీ – ఇది చక్కగా లేదు. కనుక వ్యంగ్యంగా అర్థము చెప్పాలి. పచ్చకర్పూరముతో తాంబూలసేవనం ఉన్నది గనుక (తాంబూలపూరితముఖీ) పచ్చకర్పూరము పలుకులతో గూడిన బింబాధరీ అనవచ్చును. లేదా అతిశయోక్తిగా తీసికొంటే చంద్ర (దంత) కిరణములను అనగా దరహాసములను వెదజల్లు బింబాధరము గలది.

2. చంద్రార్కాగ్నిసమాన – సూర్యచంద్రౌ స్తనౌ దేవ్యాః తావేవ నయనే స్మృతౌ, తౌ చ తాటంకయుగళం" అను ఆగమవాక్యమును బట్టి ఆమె తాటంకములు లేదా కుండలములు సూర్యచంద్రులే.

3. చంద్రార్కవర్ణేశ్వరీ – చంద్రార్కవర్ణములకు అనగా వారి కాంతులకు ఆమె ఈశ్వరి. –తత్తేజో విద్ధి మామకమ్ – గీత. లేదా, సందర్భానుగుణముగా చంద్రార్కవహ్నీశ్వరీ – అని దిద్దితే సూర్యచంద్రాగ్ని కాంతులకు ఈశ్వరి – అనే అదే అర్థము అగ్నితో కలిపి సమగ్రముగా వస్తుంది. లేదా చంద్రార్కవర్ణా – చంద్రవర్ణా అయితే సరస్వతీ – అనవచ్చును.

చూ॥ "శరద్జ్యోత్స్నాశుద్ధాం–' సౌందర్యలహరి, అర్కవర్ణా – అనగా గాయత్రి – తత్సవితుర్వరేణ్యం భర్గో" – గాయత్రీ.



**శ్లో॥ క్షుద్ర(క్షత్ర)త్రాణకరీ మహాభయహరీ మాతా కృపాసాగరీ**
**సాక్షాన్మోక్షకరీ సదా శుభకరీ విశ్వేశ్వరీ శ్రీధరీ ।**
**దక్షాక్రందకరీ నిరామయకరీ కాశీపురాధీశ్వరీ**
***భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాఽన్నపూర్ణేశ్వరీ ॥*** **10**

**ప్ర :** క్షత్ర = క్షత్రియులను, త్రాణకరీ = రక్షించునది, మహాభయహరీ = మహాభయమును హరించునది, మాతా = తల్లి, కృపాసాగరీ = దయాసముద్రురాలు, సాక్షాత్ = నేరుగా, మోక్షకరీ = మోక్షమును కలిగించునది, సదా = నిత్యము, శుభకరీ = శుభములను కలిగించునది, విశ్వేశ్వరీ = విశ్వేశ్వరపత్ని, శ్రీధరీ = శ్రీధరపత్ని, దక్ష = దక్షునిచేత, ఆక్రంద = ఆక్రోశములను, కరీ = చేయించినది, నిరామయ = క్షేమమును, కరీ = చేయునది, కాశీపురాధీశ్వరీ...

**భా :** క్షత్రియులను రక్షించునది (కనుకనే రాజేశ్వరి, రాజరాజేశ్వరి) మహాభయమయిన సంసారమును మృత్యువును అనగా అజ్ఞానమును హరించునది, తల్లి, కృపాసముద్రురాలు, ప్రత్యక్షమోక్షదాయిని, అనగా సర్వాధికారిణి, నిత్యము శుభదాయిక, విశ్వేశ్వరి, నారాయణి, సతి అయి దక్షుని ఆర్తనాదములకు కారణమయినది. బాధాహారిణి కాశీపురచక్రవర్తిని అయిన ఆ అన్నపూర్ణేశ్వరి కృపావలంబనము ప్రసాదించి మనకు జ్ఞానభిక్ష ప్రసాదించుగాక!

**వి :** 1. ఈ శ్లోకమునందలి 1,2 పాదములందు పూర్వశ్లోకపదములే వచ్చినవి. ఇది ఉపసంహారపద్యముగా సూచన కావచ్చును.

2. సదాశివకరీ = అనుపదమునకు బదులు మరోపాఠము "**మహాభయహరీ**" అనునది స్వీకరించాను. క్రొత్తదనమున్నది గదా!

3. క్షత్రత్రాణకరీ వద్ద '**క్షుద్రత్రాణకరీ**' అనటం బాగుంటుందేమో? అనగా అల్పులయిన వారిని రక్షించునది. కేవలం క్షత్రియరక్షణ అనునది సంగతముగా లేదు.

4. పేరుకు అష్టకము. కాని దశకము. 10 శ్లోకములున్నాయి గదా!

**శ్లో॥ అన్నపూర్ణే! సదాపూర్ణే! శంకరప్రాణవల్లభే! ।**
**జ్ఞానవైరాగ్యసిద్ధ్యర్థం భిక్షాం దేహి చ పార్వతి! ॥ 11**

**భా :** స్పష్టము.

**శ్లో॥ మాతా చ పార్వతీ దేవీ పితా దేవో మహేశ్వరః ।**
**బాంధవాః శివభక్తాశ్చ స్వదేశో భువనత్రయమ్ ॥ 12**

**భా :** స్పష్టము.

